Annual Subscription Rs. 2/-only. Reg. No. M. 2749.

# BHEEMA PATRICA

# భీమా పత్రిక

TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU







VOL. V. BEZWADA—MARCH 1936 No. 3

# భీమా పత్రిక

గౌరవపోషకులు

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ., ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్. ఎ. ఎస్.

,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. యె., బి. యల్.,

సంపాదకుడు: సూరంపూడి కనకరాజు పంతులు.

## భీమా పత్రిక

"భీమాపత్రిక" ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగా ముందు చెల్లింపబడవలెను. వ్యక్తులెప్పుడు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో ఆమాస పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోష్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన విచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోష్టుచార్జీల నతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని, ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0 – 0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు: మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

### BUSINESS NOTICE.

**The "Bheema Patrica" is published in the last week of every month. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.**

**The annual subscription is Rs. 2/- inclusive of postage. Single copy costs 4 annas. Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager. Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors.**

**For particulars:—The Manager, "Bheema Patrica" Bezwada (S. India),**

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు "భీమాపత్రిక" అనుపేరుదాహరింపవలసినదిగ కోరుచున్నాము.

అయ్యా!

శ్రీయుత........................................................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానముతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాను.

బెజవాడ,<br>తేది 29—3—36.

మేనేజరు,<br>భీమా పత్రిక.




# సంపాదకీయములు

## ఆర్గనైజరుపదవి

ఇన్సూరెన్సు కంపెనీల తరఫున వ్యాపారము సంపాదించుటకు ఏర్పరచు ఉద్యోగములలో ఆర్గనైజరుఉద్యోగము చాల విచిత్రమైనది. సాధారణముగా అన్నికంపెనీలలోను ఈ ఉద్యోగి చేయుపనికి ప్రతిఫలముగా కనీసము రు 100/= నూరురూపాయిలు జీతము, ట్రావిలింగు భత్య ఖర్చులు వగైరాలకు నియామకము ఒకేమొత్తముగా రు 50/- యాబదిరూపాయిలు అలవెన్సుతో ప్రారంభించి ప్రతినెల యిచ్చుచుందురు. కాని ప్రతినెల యిచ్చుజీతమునకును అలవెన్సునకును, రెంటికిని రెండులంకెలు గలవు. జీతమును పొందుటకు ప్రతినెలగాని, మూడుమాసములకొకసారిగాని, యేడాదిమొత్తముమీదగాని ఆర్గనైజరు ఉద్యోగప్రారంభములో కంపెనీతో నియమించుకున్న ఎంతోకొంత గ్యారంటీపనిని చూపవలెను. అలవెన్సునుపొందుటకు ప్రతినెల కనీసము పదిహేనుదినములైనను తనకు ఏర్పాటుచేసిన ప్రాంతములలో కంపెనీవ్యాపార ప్రచారము నిమిత్తము ప్రయాణమొనర్చుచుండవలెను. ఈ రెండుపనులును కంపెనీవారి అధికారములకును, ఎప్పటికప్పుడు వారు జారీచేయు వుత్తరువులకును లోబడి పనిచేయుచుండవలెను. అట్లు నివర్తించిన గానిఆర్గనైజరుకు ప్రతినెలఈరెండునుసక్రమముగ ముట్టవు. 15 దినములు సక్రమముగ ట్రావిలింగు చేసినగాని ట్రావిలింగుఅలవెన్సురాదు. గ్యారంటీపనిచూపినగాని జీతమివ్వరు.

ఈ ఆర్గనైజరు స్వతంత్రముగలిగిన కంపెనీ యొక్క చీఫ్‌యేజంటుగాని మామూలు ఏజంటుగాని కాడు. పోనీ గ్యారంటీపనితో నిమిత్తములేక కంపెనీయొక్క చెప్పుచేతలలో నుండి ప్రతినెల జీతముతీసుకొను ఉద్యోగస్థుడుకాడు.

గ్యారంటీపనిచూపితేనే గాని జీతమివ్వరు. ట్రావిలింగుజేస్తేగాని అలవెన్సు యివ్వరు. ట్రావిలింగుచేయుటలోను వ్యాపారము సమకూర్చుటలోను గ్యారంటీపని సమకూర్చుటతో నిమిత్తములేక ప్రతినెల కంపెనీయొద్దనుండి సక్రమముగ జీతముతీసుకొను ఉద్యోగస్థునితో సమానముగ కంపెనీవారు యీఆర్గనైజరు వద్దనుండి పనిని పుచ్చుకొనుచుందురు.

ఇట్లుచేయుటలో కంపెనీవారి కెంతమాత్రమును ఆర్థికముగ నష్టములేదు. అదియునుగాక ఒకప్పుడు జీతము యివ్వవసరము లేకయే ఆర్గనైజరువద్దనుండి పనిని పుచ్చుకొని ఆర్గనైజరు కష్టముమూలమున కంపెనీలవారు తాము పొందుట కర్హతలేనట్టి అదనపులాభములను కూడ

పొందుచుందురు. ఇట్టిపని అరుదుకాదు. ఇందులకు ఎన్నో ఉదాహరణలు కలవు.

ఈ ఆర్గనైజరుస్థితి త్రిశంకుని స్థితివలె నుండును. జీతముతీసుకొను కంపెనీనౌకరు అనుకుందామా, అట్టిదికాదు. గ్యారంటీవ్యాపారము చూపి కంపెనీచెప్పుచేతలలో నుండి ప్రతినెల కనీసము 15 దినములైనను ట్రావిలింగు చేస్తేనే గాని జీతముగాని అలవెన్సుగాని యివ్వరు.

కంపెనీవారి చెప్పుచేతలలో నుండి వారు ఏర్పాటుచేసిన ప్రకారము కార్యక్రమము ననుసరించి తనకు ఏర్పాటుచేసిన ప్రాంతములలో ప్రయాణముసల్పి కంపెనీతరఫున భీమావ్యాపార ప్రచారము సల్పినప్పటికిని దేశకాలపరిస్థితులనుబట్టి ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కకాలములో గ్యారంటీ చేసినపని కాకపోవుటయేగాక సంతృప్తికరమైన కనిష్ఠమొత్తమునుగూడ సంపాదించుటకు అవకాశములేకపోవును. గ్యారంటీపని జరుగలేదన్నమాటయేగాని ఆ కాలములో ఆర్గనైజరుకు అహర్నిశములు కంపెనీచాకిరి తప్పదు. కంపెనీవారి చెప్పుచేతలలో నుండి సంపూర్ణముగ తనవిధ్యుక్తధర్మమును చేసినాము గదా యని నెలాఖరున కంపెనీవారిని జీతముఅడిగితే నీవు గ్యారంటీచేసినపని కాలేదు. జీతము యిచ్చుటకు వీలులేదు. నీకు ట్రావిలింగుచార్జీలుకూడ దండుగపెట్టినాము' అని కంపెనీవారు జవాబు చెప్పుచుందురు. కంపెనీవారిది యేమిపోయింది? ఇచ్చిన ట్రావిలింగుచార్జీలకు నెలపొడుగున కంపెనీవ్యాపారప్రచారము అనుపేరుతో ఆర్గనైజరుచే చాకిరి చేయించుకొనియుందురు. కంపెనీ వారికెంతమాత్రమును దండుగలేదు. కంపెనీవారికి వ్యాపారప్రచారముమాత్రము బాగుగ జరుగును. ఆర్గనైజరుకుమాత్రము చేసినచాకిరికి ప్రతిఫలముగా తినుటకు జీతముండదు. జీతము అడిగితే పని లేదు'జీతము లేదు అనుచుందురు. కంపెనీవారిచెప్పుచేతలలోనుండి నెలపొడుగున ఆర్గనైజరు కంపెనీకి కష్టపడిచేసిన చాకిరీ ఏమైందో తెలియదు.

చాలామంది కంపెనీ ఉద్యోగస్థులు ప్రావిడెంట్ ఫండ్ ఏర్పాటులతో ప్రతినెల పెద్దపెద్ద మొత్తములను జీతములుగా తీసుకొనుచు నీడపట్టుననుండి తాఖీదాలను చెక్కుచు ఆర్గనైజర్ల జీతములను బిగబట్టుటయే ఎరుగుదురుగాని గృహమును భార్యాబిడ్డలను విడిచి రాత్రింబవళ్ళనక ఎండ వాననక కర్రయో పామో ఎరుగక కష్టించి కంపెనీ తరఫున పనిచేయు ఆర్గనైజరు శ్రమను ఆతను కంపెనీకి చేసిన సేవను గుర్తించక పోవుట చాలవిచారకరము.

ఆర్గనైజరుకు ఉద్యోగముల విషయములలో కొంతమంది కంపెనీలవారు చాలాఅక్రమముగా ప్రవర్తించుచున్నారు.

గ్యారంటీ పని, నెలజీతము, అనడంలో అర్థమేమియు లేదు. నెలజీతము అంటే కంపెనీవారు ఆర్గనైజరుకు నియమించిన పనులను సక్రమముగ నిర్వర్తించి వారిచెప్పుచేతలలోనుండి గ్యారంటీతో నిమిత్తములేక నెలపూర్తియైన వెంటనే యివ్వబడు జీతము నెలజీతము ఉద్యోగము అనిపించుకొనును గాని గ్యారంటి పనితో నిమిడీయున్న జీతము జీతముకాదు. ఉద్యోగము ఉద్యోగము కాదు. ఈఆర్గనైజరు ఉద్యోగము మామూలు ఏజన్సీయనిగాని చీఫ్ఏజన్సీయనిగాని ప్రత్యేక ప్రాతినిధ్యము అనిగాని కంపెనీ ఉద్యోగమనిగాని యనిపించుకొనదు. స్వలాభముతో కంపెనీ వారిచే ఏర్పాటు చేయబడిన ఒకవిచిత్రమైన ఉద్యోగము. ఈ ఉద్యోగములో, పనియున్నను లేకపోయినను నెల సరి జీతములను సక్రమముగ తీసుకొనుఉద్యోగియులు నిర్వహించు భాధ్యతలకంటె ఆర్గనైజర్లు ఎక్కువ బాధ్యతలను జీత

భత్యములు లేకయే నిర్వహించవలసియున్నది. ఆర్గనైజర్లు గ్యారంటీపని యివ్వనప్పుడును, కంపెనీలు జీతములు యివ్వనప్పుడును కంపెనీలకును ఆర్గనైజర్లకును సంఘర్షణలు జరుగుచునే యుండును. జీతభత్యములలో అభిప్రాయ భేదములు వచ్చినప్పుడు సమర్థులైన ఆర్గనైజర్లుకూడ కంపెనీలను వదలి ఇతరకంపెనీలకు పోవుటఅరుదుకాదు.

కంపెనీలవారు ఆర్గనైజర్లకు యిచ్చునెల జీతములతో గ్యారంటీపని ముడిబెట్టిన న్నాళ్లు ఆర్గనైజరు వృత్తి సక్రమముగను, సంతృప్తికరముగను జరుగనేరదు. ఆర్గనైజేషన్ పనికి కంపెనీలవారు ప్రతి సంవత్సరము ఖర్చులక్రింద కొంత సొమ్మును ప్రత్యేకించుకొని గ్యారంటీ పనితో నిమిత్తము లేకయే నెలసరిజీతములపై ఆర్గనైజర్లను ఏర్పాటుచేసి కంపెనీ వ్యాపార ప్రచారము చేసినప్పుడే నిజమైన వ్యాపార ప్రచారము జరిగి, కంపెనీల వ్యాపారము యిప్పటి కంటె మిగుల అభివృద్ధిలోనుండును. ఆర్గనైజరులను ఏర్పాటు చేయుటలో మామూలు ఏజంటుగ కనీసము అయిదు సంవత్సరములైనను పనిచేసి మూడు లక్షలమొత్తమునకు తక్కువ కాకుండా పట్టాలను జారీచేయించి పనిని సమకూర్చి కంపెనీ తరఫున పనిచేయుచున్న ఏజంట్లనుండియే కంపెనీలవారు గ్యారంటీ పనితో నిమిత్తము కాకయే జీతభత్యములతో ఆర్గనైజర్లను ఏర్పాటు చేయవలెను.

గ్యారంటీ షరతుల కాలము వెళ్లిపోయినది. ఇట్లు విషమషరతులతో కంపెనీవారు ఇక ముందు ఎక్కువ వ్యాపారమును చేయజాలరు. పట్టాదార్లకు పట్టాషరతులలో తగుసౌకర్యములును, ఆర్గనైజర్లకు గ్యారంటీలేకయే సంతృప్తికరమగు తగు నెల సరిజీతములును యిచ్చి కంపెనీలవారు వ్యాపారముచేయించుకొనవలసిన దినములు వచ్చినవి. ఆర్గనైజరు పదవిలోగల లాభనష్టములు, శ్రమబాధ్యతలను గూర్చి విపులముగ ముందు సంచికలో చర్చించ బడును.

## భీమా శాస్త్రంమీద పుస్తకాలు

(శ్రీ శనివారపు సుబ్బారావుగారు)

1935 జూలై - 1936 ఫిబ్రవరి సంచికలలో యీవిషయంలో 53 పుస్తకాల వరకు జాబితా యిచ్చాను. పిమ్మట నేను చదివిన పుస్తకాల జాబితా యీదిగువను వివరించితిని.

(54) The advantages and uses of a Life Policy published by Buckley Press Limited, London. 0-12-0

(55) Assignment of Policies of Life Assurance Co. Charles Edward Howell. 1—8-0

(56) Policy and its Implications by S. L. Roy. 0—8-0

(57) The Law of Insurance in British India by B. N. Banerjee. 3—8-0

షరా:—రు 2 లు అడ్వాన్సుగా పంపినవారికి యీ పుస్తకాలను సప్లై చేయు ఏర్పాట్లు శ॥ సుబ్బారావుగారు కొవ్వూరు (ప॥ గో) చేయగలరు.

### సక్సెషను సర్టిఫికట్టు - క్లెయిము పరిష్కారము

ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీలో ప॥ గోదావరిజిల్లా తెణుకు తాలూకా అజ్జరంగ్రామంలో జయవరపుఆదినారాయణఅను ఇత్తడివ్యాపారం వర్తకుడు రు 3000 లకు ఇన్సూరు చేసెను. ఈయన చనిపోవగా క్లైముకాగితాలను చీఫ్ ఏజంటు అయిన శ్రీ శనివారపు సుబ్బారావుగారే సర్టిఫైచేసి కంపెనీకి పంపునటుల కంపెనీవారంగీకరించిరి. వేరే మేజస్ట్రేటు వగైరాలతో నిమిత్తం లేకుండగానే ఈపాలసీదారు తనపట్టాను దఖలు పరచనందున కంపెనీవారు సక్సెషను సర్టిఫికెట్టును కోరగా పట్టాదారుభార్య మైనరుకొడుకు తరఫున తణుకు మునసబు కోర్టులో సక్సెషన్ సర్టిఫికట్టుకొరకు పిటీషన్ దాఖలుచేయగా కోర్టువారు మైనారిటీ వదలువరకు (అనగా 2 వత్సరముల యీడుగల కుమారునికి) బ్యాంకులో సొమ్మునుంచి ఆవడ్డీనే అనుభవించుటకు అనుజ్ఞయిస్తూకోర్టువారు సక్సెషనుసర్టిఫికెట్టునుయిచ్చిరి. ఈవిషయంలో కొవ్వూరులో నున్న మానాప్రగడ శ్రీరాములుగారు, బి. ఏ. యల్. యల్. బి., తణుకు కోర్టులో యీపట్టాదారుతరఫున వాదించిరి.

పట్టాను దఖలు పరచని యెడల కలిగే చిక్కులు యిట్టివని గ్రహింతురుగాక! ఇందులకు రమారమి రు 300 లు ఖర్చు అయ్యెను. దఖలు పరిచినచో ఈఖర్చు లుండవని గ్రహింతురుగాక

# జీవితభీమా అనగా నేమి?

[పాఠశాలలయందును కళాశాలలయందును జీవితభీమాశాస్త్రము బోధింపబడవలయును.]

విద్యాసముపార్జనమునందు నేను నా జీవితమున పదునాఱు సంవత్సరముల దీర్ఘకాలమును వెచ్చించితిని. కాని జీవితభీమా అనగా నేమియో నాకు తెలియదు. నేను ఉద్యోగమున కాలిడుచున్నాను. తోడనే నన్ను ఎందరో భీమా ఏజెంట్లు చుట్టుముట్టుదురు. వారు దీర్ఘములగు ఉపన్యాసముల గావించుచు నడుమ నడుమ కొన్ని ప్రశ్నల జారవిడుతురు. జీవితభీమాశాస్త్రముతో నాకు బొత్తిగా పరిచయము లేని కారణమున నే నాప్రశ్నలకు తగు సమాధాన మీయలేకపోవుదును. అయినను పట్టభద్రుడ నగుటచే అజ్ఞానమును ఒప్పుకోక తెలిసినట్లు నటింతును. నిశితప్రతిభుడగు భీమాఏజెంటు నాస్థితిని తోడనే గ్రహించును అందుతో అవమానభరము అగ్గలమై నేను వినమ్రుడనగుసంతలో అతడు ప్రజాసామాన్యమున జీవితభీమాను గూర్చి అంతుదరిలేని అజ్ఞానము ప్రబలియున్నదనియు మన విద్యావిధానమున భీమాశాస్త్ర బోధనము లేకుండుట యొక గొప్పలోప మనియు చెప్పి నాహృదయభారమును కొంత తగ్గించును.

నేడు మనపాఠశాలలలో బోధింపబడుచరిత్ర, భూగోళము, వివిధ భాషలు, ఆల్జిబ్రా, జామిట్రి మొదలగు వానికంటె భీమాశాస్త్రబోధనము ఎక్కువ వాంఛనీయమైనది, లెస్సగ అక్కరకువచ్చునది. నేటి విద్యావిధానము విద్యార్థులను సర్వదా స్వప్నలోకమున ఉంచుచున్నది. పట్టభద్రుడనగుటకు నేనెంతయో కష్టపడితిని. పట్టముపొందిన తరువాత దానికొరకు నేను పడిన కష్టమంతయు వృథా యనిపించుచున్నది. ఈ పట్టముకొఱకు నేను శారీరక మానసిక శక్తుల ధారపోసితిని. అయినను ఈ పట్టమువలన పట్టెడు మెతుకులు ఆర్జించలేక పోవుచున్నాను. పోనీ స్వతంత్రముగ నేదైన వ్యాపారము చేయుద మనుకొంటినా వ్యాపారమునకు అతిముఖ్యము లగు ఎక్కౌంట్లను గూర్చిన జ్ఞానము నాకు బొత్తిగా లేదు. పట్టభద్రుడనయ్యు నేను విచిత్రప్రపంచమున నిలబడుచున్నాను. ఎట్లో కష్టపడి ఏదేని ఉద్యోగమును సంపాదించితినా భీమాఏజెంటువచ్చి నా జీవితమును భీమాచేయుమని బోధించును. భీమాయన నాకు తెలియదని ఒప్పుకొనక తీరదు. ఇట్లే ప్రతిదినమును నేను తెలియని విషయముల నెన్నిటినో ఎదుర్కొనవలసివచ్చుచున్నది. ఈ పరిస్థితులలో ధైర్యమువహించి ఆయావిషయములను తిరిగి నేర్చుకొనుట తప్ప గత్యంతరము లేదని నేను తెలిసికొనుచున్నాను.

ఇంతకును ఇన్సూరెన్సు ఏజెంటు ఏమినేర్పుచున్నాడు? మానవుని మేధ సృష్టించిన వ్యవస్థలలో ముండ్లులేకుండ గులాబీలు యిచ్చు వ్యవస్థ జీవితభీమాయే. జీవితభీమా ప్రయోజనముల పాతర. దాని ప్రయోజనములతో కలిసి ఎట్టి అసౌకర్యములుగాని లేవు. అది వ్యక్తులకు, జాతులకు, సమగ్రమానవలోకమునకు సహాయము గావించును. అది దేనినిగాని కష్టపెట్టదు. జీవితపథమున గమనమును అది శాంతమైనదిగా, సుకరమైనదిగా, సులభమైనదిగా చేయును.

జీవితభీమా పద్ధతిలో వ్యక్తులు నియమప్రకారము ప్రీమియము లనబడు కొన్ని చందాలను ఈయవలసి యుండును. ఇట్లు చందాల

నిచ్చుదానికి ప్రత్యామ్నాయముగ వారి మరణానంతరముగాని వృద్ధాప్యమునగాని కొంత సొమ్మును బడయుటకు వారు హామీని పొందుచున్నారు. భీమాచేసిన వ్యక్తిదృష్టితో చూచితిమేని అతడు అకాలమరణమునకు పాల్పడుచో తానుకట్టినవి కొద్ది ప్రీమియములే అయినను భీమాచేసిన మొత్తమును పొందుటవలన విశేష లాభమును బడయుచున్నాడనవచ్చును. భీమాచేసియున్నచో మరణమువలని భయము అంత తీక్ష్ణమైయుండదు. ఏమన; తాను ఎవరికొఱకు ఇపు డింత కష్టపడుచున్నాడో అట్టి తనభార్యయు, బిడ్డలును తన మరణానంతరము కొంతధనమును నిశ్చయముగ పొందగలరుగదాయను ధైర్యమాతనికుండును. తాను ఏర్పఱచిన భీమాధనమును పొంది తన ఆలుబిడ్డలు స్వతంత్రముగ బ్రతుకగలరు. అందుచే వారు ఇతరుల పోషణకు ఆశించి ఆ ఇతరుల సూటిపోటు మాటలకు గుఱికావలసిన అవసర ముండదు. అకాలమరణమునకు పాల్పడక అతడు పూర్ణపురుషాయుషజీవియే అయినచో అతడు యథాకాలమున భీమాచేసిన మొత్తమును పొందుచున్నాడు. పైగా బోనస్‌లని పిలువబడు లాభములను గూడ బడయుచున్నాడు. ఇవి అతని ఆర్జనశక్తి తగ్గియుండు వృద్ధాప్యకాలమున కంది అతని అక్కరకు వచ్చుచున్నవి. నియమప్రకారము ఇట్లు ప్రీమియములు కట్టియుండకపోయినచో అత డిట్టి పెద్ద మొత్తమును కూడబెట్టుట దుస్తరమే. జీవితభీమా అతనిచే ఈ మొత్తమును నిర్బంధముగా కూడబెట్టించినది.

వ్యక్తియేకాక జాతికూడ జీవితభీమా విధానమువలన విశేషలాభమును బడయుచున్నది. పెక్కువ్యక్తులు తాము కూడబెట్టిన ధనమును జీవితభీమావిధానమువలనతగుమాత్రములాభకరమైన ప్రచారమున పెట్టుచున్నారు. 'సమష్టిగానున్నచో మనము అజేయులము. వ్యష్టిలో అంతయు వ్యత్యస్తమే' అను నానుడి జీవితభీమా విధానమున మరిదేనియందుకంటెను విశేషముగ విస్పష్టమగుచున్నది. ఒక్కొక్కడు ఒక్కొక్క రూపాయిచొప్పున ఒక కోటిమంది కట్టు ప్రీమియములు ఒక గొప్ప ధనరాశిని గూర్చుచున్నవి. ఆ పెద్దమొత్తము ఒక బ్రహ్మాండమగు పరిశ్రమను నెలకొల్పి ఒక జాతి జాతికంతకును మృష్టాన్నమిడగలుగుటకు వీలు కల్పించుచున్నది. ఒక జాతియందలి వ్యక్తులకు జీవితభీమా ఛేదింపరాని సాముదాయికస్థితిని కల్గించుచున్నది. ప్రభుత్వములకు, పారిశ్రామికసంస్థలకు దీర్ఘకాలపు అప్పులయొక్క ఆవశ్యకత యెంతేని గలదు. బ్యాంకులు మొదలగు సంస్థలు ఇట్టి దీర్ఘకాలపు అప్పుల నిచ్చుటకు ఎల్లవేళల సమర్థములుగావు. ఇన్సూరెన్సు కంపెనీలు ఇట్టి దీర్ఘకాలపు ఋణముల నిచ్చుట కెంతయు సమర్థములైనవి. ఈ విషయమై బ్రిటిష్ ఆర్థిక శాస్త్రవేత్తయగు ప్రొఫెసర్ డి. మార్గన్ ఏమిచెప్పుచున్నాడో చూడుడు: 'కట్టకట్టుకొని ఒక్కసారిగా పెక్కుక్లెయిములు వచ్చుటచే నెన్నియో బ్యాంకులు విలుప్తమైనవి. ఇన్సూరెన్సు కంపెనీల విషయమున ఇట్లు ఒక్కసారిగా పెక్కు క్లెయిములు వచ్చునని భయపడుటకు అవకాశ మెంతమాత్రమునులేదు. పట్టాదారుల చావువలన నష్టములు ఇన్సూరెన్సు కంపెనీకి ఎడపదడపయు, క్రమముననను, సాధారణముగ కాలనియమము ననుసరించియు వచ్చుచుండును రాగల వత్సరములలో క్లెయిములకు గాను ఇంతటి మొత్తమును ఈయవలసియుండునని సుమారుగా అంచనాకట్టుట యొకకష్టముగాదు.

జీవితభీమావిధానమున ఒక గొప్ప ధార్మిక

గుణము ఇమిడియున్నది. తాము ఎఱిగియుండని, చూచియుండని పట్టాదారు డొకడు మృత్యుదేవత పాల్పడినపుడు భీమాకంపెనీ ఇతని కిచ్చు ధనము బ్రతికియున్న ఇతర పట్టాదారుల ప్రీమియములవలని వడ్డీనుండి గ్రహించిన దేయనుట ఎల్లరును సులభముగ నేగ్రహింతురు. బ్రతికియున్న పట్టాదారులు ఈరూపేణ కొంతనష్టపడుచున్నారనుట నిశ్చయమే. తన జీవితమును భీమాచేయకయే ఒకడు చనిపోయినాడనుకొందము. ఆతని అనంతరము ఆతని ఆలుబిడ్డల పోషణభారము బ్రతికియుండు ఆతని బంధువులపై పడునుగదా? అట్టి భారము ఒక్క బంధువుల మీదనే పడకుండ జీవితభీమా ఆభారమును పట్టాదారుల అందరిమీదను మోపుచున్నది. అనగా ఏమన్నమాట? ఒక భీమా పట్టాదారు అనుకొనకయే తాను అనాథస్త్రీలకు, అనాథ శిశువులకు యథాశక్తిని ధనసహాయము చేసిన దాతయగుచున్నాడు. అయినను భీమాచేయువారు సాధారణముగా భీమాపట్టావలన తమకు ఆర్థికముగా కలుగు లాభముల నుపలక్షించియే చేయుచున్నారు కాని విశాలవిశ్వమునకు తాము యథాశక్తిని ఉపకారము చేయుచున్నామను ఉదారభావముతో చేయుటలేదు. కావున దీనిని అనుకొననిదాన మనుటకంటె లాభదృష్టిగల దయాళుత్వమనుట లెస్సగ నుండును. యజమానిచావువలన అనాధలుగ చేయబడిన స్త్రీలను బిడ్డలను పోషించుటకు యథాశక్తిగ తోడ్పడుటకంటె చేయదగు విశేష ధర్మకార్యము మఱియొకటి ఏమిగలదు? తమకు ఆహారము కూర్చిపెట్టువాడు మృత్యుదేవతచే క్రూరముగ కొనిపోబడిన కష్టకాలమున ఒకానొక కుటుంబమువారికి భీమాకంపెనీలవారొసగు ఆర్థిక సాహాయ్యము హెచ్చువిలువకలదియగుచున్నది. వైద్యశాస్త్రజ్ఞానమున మనము ఇపుడు విశేషాభివృద్ధి నందియున్నను మృత్యుదేవతయొక్క వీరవిహారమును అరికట్టలేక పోవుచున్నాము. అయినను భీమాసంస్థలవలన మృత్యుదేవతయొక్క వీరవిహారమువలని దుష్ఫలితములను మనము సమష్టిగా ఎదుర్కొని వాని తీక్ష్ణతను తగ్గింపగలుగుచున్నాము.

నేటి నాగరిక ప్రపంచమునకు జీవితభీమా వ్యవస్థ యొక వరప్రసాదమగుట సునిశ్చయమగుచున్నది. అనాథస్త్రీలకు, అనాథ శిశువులకు అది గొప్పసాయము గావించుచున్నది, సంపదను కూర్చుచున్నది, వంతులవారిగా మన అందరికష్టములను తగ్గించుటకు సాధనమగుచున్నది. భీమావిధానములేని నేటి నాగరికత అంతయు యథాయథలగుచున్నది. జీవితభీమా చిరకాలము వెలయుగాక!

—హార్ బక్సుయల్, హింగొరాణి, బి. ఏ.
—The Indian Policy Holders' Review.
(ఆంధ్రభూమినుండి)



# క్రిసెంటు యిన్సూరెన్సు కంపెనీ ద్రవ్యాపహారణము

## కంపెనీఉద్యోగి శిక్షింపబడుట, దేశ ఆర్థికాభివృద్ధి కుపద్రవము.

"సాక్ష్యమువల్ల యిందు తెలుపబడిన నేరము చాలానెలల ప్రయత్నముమీద జరిగినది. హఠాత్తుగా చేసినదిగాదు. ముద్దాయి తనమీద యిన్సూరెన్సు కంపెనీవారు తొందరపడి క్రిమినల్ ప్రోసీడింగ్సు పెట్టక సాయలాపాయలాగా ప్రవర్తించిన యెడల బాగుండుననియు లేని యెడల కంపెనీని అనవసరముగా అల్లరిచేసి వారివ్యాపారమునకు భంగము కల్గచేయుదుననియు జడిపించి బెదరించిన వాక్యములవల్ల ముద్దాయిగుణము బయటపడినది. ముద్దాయిమాదిరి పెద్ద పదవిలో యున్న వారికి సరియైన నడత లేకుండుటవల్ల దేశముయొక్క ఎకనామిక్కు, సోషల్ వ్యాపారము అభివృద్ధి పెంపొందకుండుటకు కారణము కాగలదు. ఇదివరలో యీ కేసులోని ముద్దాయికి 5 సంవత్సరముల కఠినశిక్ష అనుభవించినప్పటికి ఆశిక్షఫలితము వానికి తగిన పాఠము నేర్పలేదుగావున యిప్పుడు చేసిన నేరముకుగాను చాలా కఠినశిక్షయివ్వవలసియున్నది.ముద్దాయికి 50 సంవత్సరములు వయస్సుఅయినప్పటికి చేసిన నేరమును బట్టి విడిఖయిదు వేయుటకు తగదనియు, కఠినశిక్షయే సరిపోయినదనియు జడ్జిగారు రిమార్కుజేసిరి."

పై విధముగా మ-రా-శ్రీ వి. వి సుబ్బారావు పంతులుగారు కృష్ణా సెషన్సుజడ్జిగారురిమార్కుచేయుచు, క్రిసెంటు యిన్‌సూరెన్సుకంపెనీవారిని మోసము చేసినందుకుగాను 409 ఐ.పి.సి. సెక్షన్ క్రిందను, ఐ. పి. సి 75 సెక్షను ప్రకారము పాత ముద్దాయివల్లను ముద్దాయి అయిన జె. కె. రాజారావుగార్ని శిక్షించుతూ తీర్పుచెప్పిరి.

### ప్రాసిక్యూషన్ కేసు

ప్రాసిక్యూషను కథ యిట్లుండెను:—

జె. కె. రాజారావు గారిని క్రిసెంటు యిన్స్యూరెన్సు కంపెనీవారు (బొంబాయి హెడ్డాఫీసువారు) మదరాసురాజధానికి కంపెనీతరఫున ఏజంటుగా ఏర్పాటు చేయుచు, రాజారావుగారు కంపెనీకి క్రొత్తవ్యాపారము సంపాదించుటకును, పాలసీమీద ప్రీమియయములను వసూళ్లుచేసి బెజవాడలో యున్న బ్రాంచిఆఫీసుయొక్కయు, యితర చిన్న ఏజన్సీలయొక్కఖర్చులుపోను మిగతా వసూలయిన పైకము బొంబాయి హెడ్డాఫీసుకు పంపవలెననియు కంపెనీకి గుంటూరుకోర్టులో గల వ్యాజ్యముల విషయము పనిచూడ వలసినట్లును యిన్‌స్ట్రక్షనులు యిచ్చి వ్యాపారము చేయించుచుండిరి. యిటుల జరుగుచుండగా, గుంటూరులో జరిగిన కంపెనీవ్యాజ్యములలో కంపెనీకి గుంటూరు జిల్లాకోర్టులోనుండి రు 4383-9-0 రావలసియుండెను. కంపెనీవారు యీడబ్బును కోర్టునుండి తీసుకొని వెంటనే బొంబాయి ఆఫీసుకు పంపమని ఉత్తర్వులు చేయగా, రాజారావుగారు గుంటూరులోని కంపెనీ అడ్వకేటు ద్వారా 19-1-35 తేదిన రు 4383-9-0 కోర్టులో నుంచి తీసుకొనికంపెనీకి పంపక వారివద్దనే యుంచుకొని కోర్టులోనుంచి డబ్బును తీసుకొన్నటుల కంపెనీ వారికి తెలియపర్చకడబ్బుకోర్టులోడిపాజిట్టుగానే యున్నదని కంపెనీని నమ్మించి, సదరు ద్రవ్యమును రాజారావుగారు అక్రమవువినియోగము చేసిరి. కంపెనీవారు ఒత్తిడిచేయగా రాజారావుగారు హీన స్థితి చూపుప్రార్థనాశీలముగల ఉత్త

మును పంపుతూ, అందులో వారు కంపెనీ పేరను ఒకప్రాంసరీ నోటును రు. 3622-2-0 కు వ్రాసి, కోర్టునుండి పొందిన మొత్తములో నోటు మొత్తముపోను మిగతా రు. 741-7-0లకు తనకు కంపెనీ కమీషను వగైరాలబాపతు బాకీ యున్నటుల పట్టీలను తయారుచేసి 1935 సంవత్సరము మేనెలలో కంపెనీకి పంపుతూ యిప్పటికి ప్రథమముగా తాను కోర్టునుండి ద్రవ్యమును 1935 జనవరిలో తీసికొనినటుల కంపెనీకి తెలియపర్చిరి. పై విషయములు కంపెనీవార్కి తెలియగా 30-5-35 తేదీన కంపెనీవారు రాజారావుగార్కి, కంపెనీద్రవ్యమును అక్రమముగా వినియోగపరచిరనియు కేసుపెట్టవలసినటుల పోలీసువార్కి తెలియపర్చినటుల, తంతి మూలమున తెలియజేసిరి. 30-5-35 న కంపెనీ అడ్వకేట్సు బొంబాయినుండి పైవిధముగా తెలియపర్చగా, రాజారావుగారు తాను జబ్బుతో మంచములో యున్నారనియు, తాను నిర్జనఖైదీ అనుభవించవలసి వస్తుందనియు కంపెనీడైరక్టర్లను తిడుతూ జవాబు పంపిరి. 1-6-35 తేదీన రాజారావుగారు కంపెనీకి మరొక ఉత్తరమును వ్రాయుచు 1935 జూలై వరకు గడువు యివ్వమనిన్ని అప్పటికి తాను బాకీయున్న సొమ్మును సుస్తాగా యిచ్చివేయుదుననియు, యిందులో తెలియపర్చిన హాంశము నేరము కాదనియు తాను జబ్బుగా యుండుటవల్లను గుంటూరులోని కంపెనీ వకీలుగారు ఖర్చులలెఖ తేల్చకపోవడమువల్ల యింతకాలము కంపెనీకి వ్రాయకుండుటకు కారణమైనదనియు, యిందులోగల హాంశముఅనగారుణము సివిల్ వ్యవహారముగాని క్రిమినల్ కాదనియు తెలియపర్చిరి. 16-6-35 తేదిన కంపెనీ క్యాషీయరును, అక్కౌంటెంటుగారైన చోటాలాలుగార్కి వుత్తరము వ్రాయుచు, తాను గుంటూరులో కంపెనీ వకీలుగారి యింటివద్దనుండి డబ్బు తీసుకొని వెళ్లుచుండగా, తన క్రెడిటర్లు కోర్టువారంట్లను అమలు జరుపగా అవమానముపొందకుండుటకుగాను కంపెనీద్రవ్యము వాడి తాను సంరక్షించుకొంటిననియు రాజారావుగారు తెలియజెప్పిరి. యీ సృష్టించిన కల్పనాకథను, మనస్సు గాభరాపడి ఆదుర్దాలో వ్రాసినదిగాని వేరొకటి కాదనియు రాజారావుగారు తర్వాత కోర్టులో చెప్పిరి. వ్యవహారములు యిటుల యుండగా కంపెనీవారు టి. నారాయణరావుగారికి పవర్ ఆఫ్ ఎటర్నీ యిచ్చి కేసుపెట్టమని ఉత్తర్వులు యివ్వగా, నారాయణరావుగారు 23-8-35 తేదీన బెజవాడ పోలీసువార్కి రిపోర్టు యివ్వగా 25-8 35 తేదీన పోలీసువారు ముద్దాయి లేనిసమయమందు సోదాచేసి కొన్ని ఎక్కౌంటుపుస్తకములను రికార్డును తీసుకుని వెళ్ళిరి. పోలీసువారు యీనేరము సివిల్ గాని క్రిమినల్ గాదని కంప్లెయింటును త్రోసివేసిరి. అందుమీదట నారాయణరావుగారు బెజవాడ సబుమేజస్ట్రీటు కోర్టులో ప్రయివేటుగా కంప్లయింటు చేసిరి. మేజస్ట్రీటుగారు యీ కేసును బెజవాడ జాయింటు మేజస్ట్రీటుగారు విచారింపవలసినదని ఆకోర్టుఫైలుకుమార్చగా, జాయంటు మేజస్ట్రేటువారు, సబ్ మేజస్ట్రేటువారిని విచారించమని తెలియపరస్తూ కేసును ఆ కోర్టునుండి ట్రాన్స్ఫరు చేసిరి. సబుమేజస్ట్రీటుగారు కేసును విచారించి ముద్దాయిని, ఐ. పి. సి. 409 సెక్షను ఐ. పి. సి. 75 సెక్షన్ క్రిందను, సెషన్సు కోర్టులో క్రమమైన విచారణకుగాను బంపియుండిరి. ఐ. పి. సి. 75 సెక్షన్ క్రింద ముద్దాయి, యిదివరలో అనగా 1924 సంవత్సర ప్రాంతమందు మరొక యిన్సూరెన్సు కంపెని (ఏషియన్ అస్యూరెన్సు కంపెనీ) దగాచేసి నిజముకాని మనిషిపేరున పాలసీ పెట్టించి, నిజముకాని చిత్తం తువును ఆపాలసీ సొమ్ముకు (షుమారు పదివేల

రూపాయిలు) వారసులని పెట్టించిన నేరము క్రింద 5సంవత్సరములు కఠినశిక్ష అనుభవించి నందువల్ల పాతనేరస్థుడుగా నిర్ణయింపబడెను.

### ముద్దాయివాదము

ముద్దాయి తాను నేరస్థుడనుకాననియు, కంపెనీ వారు తన డబ్బును బొంబాయికి పంపమని వుత్తర్వుచేసినటుల తెలుసుకొనలేదనియు, తనకు కంపెనీవద్దనుంచి లోగడబాకీయున్న జీతమును, కమీషన్ రావలసియున్నదనియు, తనకుకంపెనీ బాకీవున్న సొమ్మును తానువుంచుకొన్నటులను, తాను కొంతసొమ్మును వ్యాజ్యపు ఖర్చులక్రింద ప్లీడరుకు యివ్వవలసియుండుటచే నిల్వయుంచితి ననియు, ప్లీడరుఖర్చులజాబితాను పంపక కాల యాపన చేయుటవల్ల కంపెనీకి తెలియపర్చుటకు కాలాతీతమైనటులను, కంపెనీకి తనకుగల లావాదేవి లెక్కలను పరిష్కారముగా చూచుకొనిన తర్వాత, తనవద్దనున్న సొమ్ముమిగిలినయెడల కంపెనీకి వాపసుచేయు నుద్దేశ్యముతో యుంటి ననియు, యీలోగా తాను జబ్బుపడితిననియు, సొమ్మును యావత్తు వాడవలసి వచ్చెననియు, తాను కంపెనీకి బాకీయున్న మొత్తమునుకంపెనీ పేర నోటువ్రాసియిచ్చితిననియు, తన బాకీకిగాను కంపెనీవారు నోటును ఒప్పుకొనెదరని నమ్మితి ననియు యీకేసులోని బాకీవ్యవహారము సివిల్ కాని, క్రిమినల్ కాదనియు, 28-1-35 తేదిన కంపెనీకి డబ్బుకోర్టునుండి తీసుకొనినటుల తెలియ పర్చితిననియు మొదలుగాగల విషయములను కోర్టువారికి మనవిచేసెను.

### అసెసర్ల నిర్ణయము

అసెసర్లు అందరు ఏకగ్రీవముగా ముద్దాయి ఐ. పి. సి. 409 సెక్షన్ ప్రకారము నేరస్థుడని అభిప్రాయమును తెలియపర్చిరి. జడ్జిగారును అసెసర్ల అభిప్రాయముతో ఏకీభవించిరి.

ఆఖరుకు జడ్జిగారు, ముద్దాయి తాను యిది వరలో కఠినశిక్షను అనుభవించినటుల ఒప్పుకొనె ననియు, యీ తీర్పుకు ప్రథమమున తెలుపబడిన రిమార్కులను చేయుచూ, ముద్దాయికి 5 సం వత్సరముల కఠినశిక్షయు, వెయ్యిరూపాయిల జుల్మానాయు, జుల్మానాచెల్లించని యెడల మరియొక ఆరుమాసముల కఠినశిక్ష అనుభవించ వలెననియు తీర్పుచెప్పిరి.

ఎస్. జగన్నాధరావుగారు పబ్లికుప్రాసిక్యూటరు ప్రభుత్వపక్షమున వాదించిరి. ముద్దాయిపక్షమున బెజవాడ అడ్వకేటు ఏ. శేషాచార్యులు గారును, మచిలీపట్నం అడ్వకేటు సి. హెచ్. సుగుణభూషణరావుగారును పనిజేసిరి.

(ఆంధ్రపత్రిక)

---

# Indian Insurance Institute

(Registered under Act XXI of 1860.)

2, Royal Exchange Pla[illegible]
Calcutta.

The Commissioner of Income Tax, Bengal,
I, Council House Street, Calcutta.

Sir,

I am desired by the Council of the Indian Insurance Institute to submit the following representation for the consideration of the Income Tax Experts' Committee appointed by the Government of India.

Life Assurance Companies in India are at present taxed in terms of rules 25-30 under Section 59 of the Indian Incometax Act 1912, according to which the actuarial surplus, as ascertained by periodical valuations, has been made the basis for income tax assessment. This procedure, the Council submits, is absolutely unjust and also in conflict with the practice prevailing in England and other countries. The actuarial surplus is not exactly profit in the proper sense of the term as understood when applied to other trading concerns. The surplus represents the excess charge made to the policy holders and when distributed as bonus, is only a return of the excess payment made by them.

It is well known that the actuarial surplus is derived mainly from three heads, viz: (1) Interest; (2) Mortality and (3) Loading. If the fund derived out of the over charge made on these three heads are taxed, it becomes tant amount to an indirect taxation on the policy holders themselves and that in the worst form as if the taxation had been imposed on individual policy holders, the rate would have been much smaller according to individual earnings, but the tax on the surplus is made at the highest rate. And it is further evident that the exemption of life insurance premium from the income-tax becomes absolutely illusory if the policy holders are required to pay such a heavy income-tax in an indirect form.

The attention of the Income Tax Experts' Committee may be drawn to the remarks made by the Royal Commission appointed in England to revise the British law relating to Income-tax in 1923. They opined that "Actuarial surplus as ascertained by periodical valuations is not a true measure of 'trading' profits as that term is used in applying to income-tax. The constituent elements of this actuarial surplus were analysed by the official witness who represented the Board of Inland Revenue on this subject and we agree with the statement that this surplus contains elements which should fairly be regarded as not being within the scope of Income-tax."

The Council submits that the existing basis of taxation on life assurance companies should be immediately changed and new rules should be modelled on the basis of Income- tax law of Gteat Britain according to which the basis of taxation is the amount of interest received, less expenses for management. This is perhaps the only equitable for[illegible] of taxation that can

be imposed on life assurance companies. As an alternative the basis for income-tax assessment may be only such portion of the actuarial surplus which forms part of the shareholders' fund.

There is another point to which the Council draws the attention of the Expert's Committee. Although super tax is applicable only to individuals and not companies in other countries, in India life assurance companies are also charged super tax at the flat rate of one anna per rupee plus the surcharge. This tax is also absolutely unjust and it is very much desirable that life assurance companies as well as other joint-stock companies should be exempted from the payment of super tax.

As regards abatement of Income-tax on life assurance premiums the Council is of opinion that the existing limit of 1/6th of the total income should be changed and raised to 1/5th. Life assurance is now-a-days recognised as the best method of saving and consequently people take recourse to life assurance for all classes of requirements, e. g. daughter's marriage. children's education, pension in old age, fund for payment of mortgage loans etc. Premiums for all such assurances totalled together may often exceed the 1/6th limit and therefore it is suggested to raise the limit to 1/5th.

Besides life assurance, there are other kinds of insurance which people avail of now-a-days to cover various risks prevailing in society e. g. Motor car insurance, fire insurance, burglary insurance etc. The Council feels that abatement should be allowed on the premiums paid for such insurance also when they are arranged for only personal requirement of the individual concerned.

The Council desires that they should be allowed an opportunity to supplement this representation by oral evidence before the Committee.

I have the honour to be,
Sir,
Your most obedient servant,
H. CHAKRAVARTI
*General Secretary.*

## AT HOME.

Mrs. Achanta Rukmini Lakshmipathi, B. A., M. L. C., a member of the Women Advisory Board of the Deccan Assurance Company Ltd,, who has come here to preside over the West Kistna Political Conference was entertained to tea by The Deccan Assurance Company's Women Section at the premises of the (Deccan House) Head Office of the Company on 9-3-36.

Several prominent ladies of the town attended the function. The guests were received by Mrs. M. Kamalamma, Lady Organiser of the Company. After tea, Mrs. Achanta Rukmini Lakshmipathi spoke on the varied advantages of insurance to women, the progress of insurance in tho west and the prominent part played by women abroad in this business. She reiterated on the necessity of patronisng swadeshi companies. She expressed her hope that the Deccan Assurance Company would serve the need of women of Andhra to insurance. The pleasant function terminated with a vote of thanks rom Mrs. D. Lakshmibaiamma.

# భీమాసమాచారములు

1936 సం॥ రం ఏప్రియల్ నెల 9 వ తేదీని బొంబాయి ఏషియన్ అన్యూరెన్సు కంపెనీవారు తమకంపెనీయొక్క యిరువదిఅయిదు సంవత్సరముల రజతోత్సవమును తమ గుంటూరు బ్రాంచి ఆఫీసునందు అతివైభవముగా జరుపుటకు గొప్ప ప్రయత్నములను చేయుచున్నారు.

* * *

ఆంధ్ర యిన్సూరెన్సు కంపెనీవారు తమ ఏజంట్లకు ఏజన్సీ షరతులలోను వరుమానములలోను యిప్పటికంటె ఎక్కువవసతులను కల్పించుటకు తమ ఆర్గనైజర్లందరితో సంప్రతింపులు సలిపి అందులకు తగు ప్రయత్నములు చేయుచున్నటుల నమ్మకముగ తెలియుచున్నది.

* * *

రాబోవు జూన్ నెలలో శ్రీమైసూరు మహారాజావారి జన్మదినోత్సవసందర్భమున బెంగుళూరునుండి కన్నడభాషలో ప్రకటింపబడుచున్న "విమావాణిజ్య" అను భీమా మొదలగువిషయములనుగూర్చి ప్రచారముచేయు మాసపత్రికయొక్క ప్రత్యేకసంచికను వెలువరించుటకు ఏర్పాటులు చేయుచున్నారు.

* * *

ఇదివరలో ఏలూరునందు నాగపూరు పయినీరు అన్యూరెన్సు కంపెనీతరఫున పనిచేయుచున్న శ్రీయుత నిడమర్తి నాగభూషణం, యం. ఏ; బి. యల్. తమ ఉద్యోగమునకు రాజీనామా నిచ్చి బెజవాడలో నున్న ది డెక్కన్ అన్యూరెన్సు కంపెనీతరఫున పనిచేయుచున్నట్లు తెలియుచున్నది.

* * * *

Reg. No. M 2749.



Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.